-శ్రీ-

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# విన్నపము



భక్తవరులగు మహాత్ములార !

చరాచరాత్మకంబగు సర్వసృష్టియందును మానవ జన్మముత్తమంబు. అందు భక్తిజ్ఞానవిశారదుండగు మానవుండు సర్వోత్తముండు. సంసారమునఁజిక్కి, యఘపంకిలంబునఁ దగుల్కొని, యార్తఁబొందునాతనికి శ్రీ హరిచరణ కమల సేవార్చనంబులు దక్క వేఱొక్క మార్గంబు మృగ్యంబు. నవ విధ భక్తిమార్గంబులందును ఆ పరాత్పరునిపైని యచంచల భక్తియే యుత్తమోత్తమంబగు మార్గంబు. దుష్టజన శిక్షణంబును శిష్టజన రక్షణంబును నాపరమేశ్వరుని ప్రథమ కర్తవ్యంబులు. అందులకా సర్వేశ్వరుండు దేశకాలోచితంబులగు నవతారంబుల ధరించి ధర్మస్థాపనంబు సేయుచుండు. ఆ లీలా మానుష శరీరుండగు దేవదేవుని దశావతారంబులందు శ్రీ రామావతారంబుత్తమంబుగా బుధులంగీకరింతురు.

శ్రీ సీతారాముని నామంబే కైవల్యలక్ష్మీప్రదంబై విలసిల్లు. ప్రస్తుత కాలంబునందు నాస్తికత్వంబు ప్రబలుచున్నది. భగవద్భక్తి సన్నగిలుచున్నది. ఇది కడుంగడు విషాదకరంబు. మానవుండు నిజశేముషీ విశేషంబున ప్రకృతి శక్తుల జయించి కైవశంబొనర్చుకొని గర్వాతిరేకంబున భగవంతు నవజ్ఞ సేయవచ్చును, కానియాతండెన్నటికైన నొకప్పుడా యనంతశక్తి స్వరూపుండగు పరమేశ్వరుని యెదుట, తనప్రతిభా శక్తు లణుమాత్రంబులని యెఱుంగవలసి యుండును. కాన మానవుండెంతటి పౌరుషజ్ఞానకీర్తుల వెలయుచుండినను, తనకుం దజ్ఞత నెఱింగి, నమ్రుండై యా పరమేశ్వరుని యెడ భక్తిభావంబున మనుట శ్రేయస్కరంబు.

శ్రీజానకీ జానిపై నాకుగల భక్తిప్రపత్తులు లేశమాత్రంబయ్యును, అవి నాయంతరంగంబు నుద్బోధించుటచేతను, ఆ రామచంద్రుని కరుణాకటాక్ష వీక్షణానుగ్రహంబునను, అల్పజ్ఞుండనయ్యును, నాదేవుని లీలావిశేషంబుల సన్నుతింప నభిలాషగల్గి, ఈ చిన్నిపొత్తంబున నాభావంబుల వ్యక్తీకరించితిని నేనీ చిన్నిశతకంబు రచించి సర్వధారి సంవత్సర చైత్రశుద్ధ నవమిశనివారము

శ్రీ శ్రీ రామనవమి పుణ్యదినంబున శ్రీరామచంద్రుని యథోచితంబున బూజించి, ఇష్టదేవతాప్రార్థనంబు చేసి "మదీయకృతి నీ 'జానకీశతకంబు' నా దేవదేవున కంకితం బొసంగెద" నని నుడివిన దక్షణంబ, నాకుం దెలియకనే దాపుననున్న శ్రీరామమందిరంబున మంగళతూర్యనాదం బులు సెలంగుటవిని, నా యీకృతి కన్నియరు నాస్వా మి మన్నించి పరిగ్రహించెనని యెఱింగి, భక్త్యాశ్చర్య సమ్మోదంబుల నా సందాసు లక్ష్మియుగ్మంబు నుండి జార ప్రదక్షిణ నమస్కారాదులతో బాటు నీకృతి కన్నియ నాపరిభునకు శ్రీరామచంద్రున కర్పించి కొంటిని. నేను గొప్ప పండితుఁడనుగాను. కవినిగాను. కాననాయీ చి ఱుపొత్తంబునందలి నెరసుల సరసులు గణింపక గుణ లేశంబులున్న గ్రహించి, యనుగ్రహింతురు గాక యని వినయంబున విన్నవించువాడ.

తిరుత్తణి
సర్వధారి-చైత్రశుద్ధనవమి
శనివారము(17-4-48)

ఇట్లు,
భక్తబుధజనవిధేయుఁడు
ఉ. శంకర నారాయణరాజు

# జానకీశ శతకము

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

— దేవతా ప్రార్థన —

---

శా॥ శ్రీరామున్ రఘువంశమండను కృపా
-సింధున్ జగద్రక్షకున్
ధీరోదాత్తుని భక్తలోక వరదున్
-దేవేంద్ర సంసేవితున్
బారావారగభీరుఁ బద్మనయనున్
-బ్రావృట్ ఘనశ్యామలున్
గారుణ్యాత్ముని జానకీశుఁ గొలుతున్
-కైవల్య సంప్రాప్తికై

సీ॥ పాలమున్నీటిలోఁ బసిఁడితామరయందు
ప్రభవించెనే తల్లి-ప్రాభవమున
విశ్వమయుండగు-వెన్నునియురమున
వసియించునేకాంత-వైభవమున,
ఈరేడు జగములు-నిచ్ఛానువృత్తిమై
విహరించునే సాధ్వి-వేడ్కమీర,
తన్ను గొల్చెడి భక్తతతికి శ్రీలనొసంగు
నేయంగనామణి-యెసక మెసగ,

తే॥ అఖిల లోకంబులకు మాతయై తనర్చు
కమల నిలయావతార యాకంజనయన
జానకీదేవి నన్నెప్పు సదయమతిని
మహిత భద్రంబు లొనగూర్చి-మనుచుగాత ! 2

కం॥ శర్వాణీ హృదయేశుఁడు
సర్వజ్ఞుం డెంచు మౌళి-సర్వేశ్వరుఁడా
శర్వుఁడొసగును గావుత
సర్వాభీష్టంబు లెపుడు-సత్కృప తోడన్ 3

కం॥ హిమగిరి కూరిమి కొమరిత
హిమకర కోటీరు హృదయ-హితకారిణియా
కమలాక్షి పార్వతీ సతి
యమితదయ నొసఁగుఁగాత మవిరళ శుభముల్ 4

చం॥ కమలభవుండు భక్తజనకామ్యదు
ఁడాగమకర్త భారతీ
కమలముఖీ మనోహరుఁడు కాంచనగర్భుడు
హంసవాహనుం
డమరనుతుండు సర్వభువనాళి సృజించిన
వేల్పు మత్కృతిన్
విమల చిరాయు రున్నతుల-విస్తృతభంగి
నొసంగి ప్రోచుతన్ 5

సీ॥ కమలసంభవురాణి-కంజాతలోచన
కళలబ్రసాదించు కంబుకంఠి
విబుధలోకారాధ్య-విశ్రుతచారిత్ర
విద్యాధి దేవత-విద్రుమోష్ఠి
వికసిత నళినశోభితచారు ఘనవేణి
అంచతేజీనెక్కు - హంసగమన
భక్తజనంబుల బాలించుకల్యాణి
అజ్ఞానమెడలించు-నబ్జగంధి

తే॥ చారుపుస్తకపాణి షం-కేరు హాస్య
తమ్మిగద్దియ వసియించు తలిరుబోణి
అఖిల కవిశేఖరుల మానసాబ్జనిలయ
వాణి వెలయునుగాత నా వాక్కులంగు 6

తే॥ తరణి ప్రభవంబుచే మాయు-తమముపోల్కి
గరుడునగనిపాఱు సర్ప సం-ఘంబు కరణి
నెవని ప్రభవంబుచే మాయు నెల్లవిఘ్న
వితతి, యా విఘ్నపతిం గొల్తు-విమలభక్తి 7

కం॥ గొలుతున్ భారత కవులను
దలతున్ షద్భక్తిం గృష్ణధరణీశవునిన్
దలగేలుమోడ్చి మ్రొక్కుదు
విలసిత సద్యశుల నాంధ్ర విద్వత్కవులన్ 8

తే॥ భక్తిఁ గేల్మోడ్చి నుతియింతు-బంమపుణ్యు
నార్యజనమాన్యు భాగవతాగ్రగణ్యు
గలుష దూరుఁ దత్త్వజ్ఞుఁ గవివరేణ్యు
భూరిసద్యశు బమ్మెర పోతనార్యు 9

తే॥ తల్లి దండ్రులఁ బూజించి-యుల్లమందు
గురుజనంబుల మదమున-గోర్కెఁదీర
మ్రొక్కి, సద్భక్తి భక్తులఁ-బూజసేసి
వ్రాయఁగడఁగితి శతకంబు-రాముపేర 10

కం॥ వ్రాయుదు రామస్తోత్రము
వ్రాయించెడు వాఁడు రామవసుధేశుఁడు నే
వ్రాయుదు నాకూరితంబులు
వ్రాయుటకును కవితకీర్తివంతమగుటకున్ 11

కం॥ రాముఁడె నాపర దైవము
రాముఁడె నారక్షకుండు-రఘునాథుఁడె నా
కామిత ఫలదుఁడు సీతా
రాముఁడె నాకేడుగడ నిరంతర మవనిన్ 12

తే॥ ఒక్కనాడైన గురువులయొద్ద నేను
జదువ ఛందంబులోనగు-శాస్త్రచయము
కవిత జెప్పితి శ్రీరాము కరుణతోడ
తప్పులెన్నకుడీ యుచితజ్ఞులార! 13

తే॥ క్షీరనీరంబు లొసగిన క్షీరమును గొని
యుదకమును వీడుచుండు, నీడోద్భవంబు
సుజనులట్టులె కైకొందురు సుగుణములను
వారలకు భక్తినిడుదు జోహారులెపుడు 14

తే॥ కాటు వేసెడి సర్పంబు కరణి నెపుడు
గుణములన్నిటి విడనాడి కుటిలు లగుచు,
నెరసులను నెమ్ముకొ తమ నిత్యవృత్తి
గాగ జరియించు ఖలుల, నేగణుతిసేయ 15

కం॥ కవిపండిత జనములు నా
కవనంబత్యాదరమున గాంచి సదయతన్
సవరింపుడు తప్పున్నన్;
వివరింపుడు గుణములున్న విశ్రుత భంగిన్ 16

— షష్ఠ్యంతములు —

కం॥ హారికి, సరయూతీర వి
హారికి, భృగురామగర్వహారికి, దేవేం
ద్రారి [illegible]కి, ఖరసం
హారికి, సంసార దుఃఖహారికి, హరికిన్ 17

కం॥ శివచాప భంజనునకున్
పవనజ సంసేవ్య దివ్య పాదాబ్జునకున్,
భువనైక సుందరునకున్
భువితపమూలోలునకును భూరియశునకున్. 18

కం॥ రామునకున్, ఘనదురిత వి
రామునకున్, సద్గుణాభి-రామునకున్, శ్రీ
కామునకున్, నీలఘన
శ్యామునకున్, భక్తలోక సంత్రాణునకున్ 19

కం॥ సరసిజ సంభవనుతునకు
సరసీరుహాలోచనునకు-సర్వాత్మునకున్
సురుచిర కౌస్తుభధరునకు
వరకోదండునకు, రామ-వసుధేశునకున్ 20

వ॥ భక్తి పరవశ దేహుండనగుచు నిటలతలంబు నిలా
తలంబున జేర్చి, యా జానకీ జాని పవిత్రాంఘ్రి
సరోరుహంబులకు బహుప్రణామంబు లాచరించి మదీ
య కృతి నీ 'జానకీశ శతకంబు' నా దేవదేవున
కంకితంబొనరించెద 21

సీ॥ అజ్ఞాన సంతమ-సాచ్ఛాదితుండనై
తెలియగానైతి నీ-దివ్యమూర్తిఁ;
సంసార జలధి ని-స్స్వన బధిరుండనై
వినలేదు నామంబు-వీనులలర;
మోహపాశనిబద్ధ-దేహుండనై భక్తి
జేయ నీపూజలు-చేతులార;
బహుజన్మదురిత బ-ద్ధ-భంజనాహారి ధూళి
చిత్తంబు నిలయందు-జేర్పనైతి;

ఇంతవఱకును జన్మంబు-వంతగూర్చె;
పూర్వభవ పుణ్యలవమున-పొదలె నిపుడు
భక్తిలేశంబు మనమున,-వసటదీర
శరణు జొచ్చితి నను బ్రోవు-జానకీశ

తే॥ ఎందఱెందఱొ పూతాత్ము-లిచ్చవంద
నార్చన ధ్యాసకీర్తన లందుకొనుచు
మఱియు నిచ్చిత్తమునకు నాపూజ లెంత?
సదయ హృదయంత గొనుము, యోజానకీశ!

తే॥ భక్తమందార! రామ! నీ-పైన గల్గు
భక్తి తాత్పర్యములఁ దెల్ప-శక్తికొలది
తోచినట్టుల నీనామ స్తోత్ర మెలమి
వ్రాసి యొసగితి మన్నింపు-రామచంద్ర! 22

సీ॥ సకల సద్గుణ గణ-సంపన్నుఁడెవఁడన్న
పేర్కొన దగినట్టి విశ్రుతుండు,
బీదలఁబోషించు వితరణుండెవఁడన్న,
చూపెట్ట దగినట్టి-శుభ్రయశుఁడు
బంధుపుత్ర సుమిత్ర పాలకుండెవడన్న
గణియింప దగినట్టి-గుణగణుండు,
వేదాంతవిజ్ఞాన వేద్యుఁడెవ్వఁడన్న
వచియింపఁదగినట్టి భవ్యతముఁడు,

ఆర్తులబాడగన్న నబ్బినయంతలో
నార్తి బాపిన యట్టి యన్నుమిన్న,
అత్యాదరంబున నాకొన్నవారల
యాకలిమాన్పిన యబలమిన్న,

తే॥ తనకుగల్గినయంతలో దానధర్మ
ములను ముదమార సల్పిన పొలతిమిన్న,
అనగసత్కీర్తిగాంచిన అస్మదంబ,
బాపమాంబను సద్భక్తిబ్రస్తుతింతు, ౨౫

సీ॥ ఘనతపోమహిముండు మునికులమండనుం
డాభరద్వాజ గోత్రాన్వయుండు
చారుయశశ్చంద్రి చంద్రికాధవళమై
వరలునట్టియుపేంద్ర వంశజుండు;
పరమపావనములౌ భరతాగ్రజునిపాద
పద్మసంసేవనా భ్యాసరతుండు,
పరధర్మ నిరతులై పరమకారుణికులై
వర్తిల్లు విబుధ సేవావ్రతుండ,

తే॥ నిర్మలాత్ములు సుజనులు నీతిమతులు
నైన సద్భక్తవరుల సౌహార్ద్రమతుల
స్నేహపాత్రపరమతుండనై నేజరింతు
నవని శంకరనారాయణాఖ్యతోడ. ౨౬

తే॥ శ్రీరఘూత్తమ కేశవాశ్రితశరణ్య,
సర్వలోకేశ శాశ్వత స్వప్రకాశ,
భక్తహృదయాబ్జమిత్ర పావనచరిత్ర,
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 1

తే॥ పరమపూరుష పరాత్పర పద్మనాభ,
పరమకారుణ్యనిలయ యోపద్మనయన,
నిగమనందిత నిర్గుణ నిర్మలాత్మ,
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 2

తే॥ నీలనీరదశుభగాత్ర నీరజాక్ష
రఘువరాన్వయ దుగ్ధవారాశిచంద్ర
ఆర్తజనపారిజాత పాకారివరద
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 3

తే॥ భక్తవత్సల పరమేశ ప్రణవపురుష,
పంక్తికంధర సంహార భవవినాశ,
వ్యాసనారద వాల్మీకి వంద్యవిష్ణు,
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 4

తే॥ సకలలోకంబులకు నీవె శరణమనుచు,
దివిజకోటీరఘటిత సందీప్తరత్న,
భాసితములైన నీపాదపద్మయుగళి,
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 5

తే॥ నీవునిర్మల మూర్తివి నాహృదయ
పీఠమునన్నిల్పి పూజింతుఁ బ్రేమగూడ,
నాయురారోగ్య విభవ కార్యములొసగి
సత్కృపామతిఁ బ్రోవుమా జానకీశ ! 6

తే॥ తల్లిదండ్రులు, గురువును, దైవతంబు,
బంధులాప్తులు, ప్రభులును, బరమహితులు,
రక్షకులు నీవె నాకు శ్రీ రామచంద్ర !
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ ! 7

తే॥ రామ ! రఘురామ ! దశరథ రాజతనయ !
అంజనీపుత్ర సంసేవితాంఘ్రియుగళ
ఘోరసంసార దుఃఖాపహార శౌరి
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 8

తే॥ శ్రీమనోనాథ దేవేశ శేషశయన
త్రిపురభంజన వందిత దితిజదమన
కలుషశోషణ వామన గరుడగమన
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 9

తే॥ కలుషహరణంబులైన నీకథలయందు
పుణ్యమార్గంబులైన నీపూజలందు
భవహరంబులునైన నీభజనలందు
చిత్తమెప్పుడు వర్తింపజేసి నన్ను
సత్కృపామతి బ్రోవుమా జానకీశ 10

తే॥ శ్రీధరణిజా మనోహర శేషతల్ప
వేదవేదాంత సంస్తుత్య వేదరూప
భక్తజనదుఃఖ శోషణ పాపహరణ
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 11

తే॥ పావనంబైన నీపదస్పర్శకతనఁ
బడతిఁగాఁ జేసితివి ప్రేమఁబ్రస్తరమును
భాస్కరాన్వయ తిలకనిన్ బరమభక్తి
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 12

తే॥ భవునిచాపంబు నవలీల భంగపఱచి
యవనిజాతను జేపట్టితౌర యనఁగ
నీదు మహిమంబు గొనియాడ నెంతవాడ
శరణుజొచ్చితిననుబ్రోవు జానకీశ 13

తే॥ పరశురాముని గర్వంబుఁబాఱఁద్రోలి
నృపులవంశంబు లవనిలో నిల్పినావు
నీదుశౌర్యంబడెట్టిదో నిగమపురుష
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 14

తే॥ తండ్రివాక్యంబు పాలింప దపసివృత్తి
నడవులకు సంతసంబున వెడలినావు,
నీనుపితృభక్తియెట్టిదో నిర్మలాత్మ
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 15

తే॥ భక్తిశబరియొసంగిన-ఫలముల గృప
భక్షణముసేసి యామెకు-భవ్యమైన
మోక్ష సామ్రాజ్య మొసగిన-మూర్తివీవ,
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 16

తే॥ పగతునకు సోదరుండయ్యుఁబరమభక్తి
శరణుజొచ్చిన యావిభీషణుని బ్రోచి
నట్టి నీభక్తవాత్సల్య మెట్టిదయ్య
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 17

తే॥ దైత్యతతిఁద్రుంచి మౌనుల దైన్యమడచి
లోకకంటకు రావణు పీకడంచి
లోకముల గాచినట్టి సుశ్లోకునిన్ను
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 18

తే॥ సకల నిగమాంతసన్నుత సరసిజాక్ష
సకలలోకైకనాథ యోసర్వసాక్షి!
సకల దురితాపహార యోసన్నుతాంగ!
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 19

తే॥ పన్నగాంతకవాహన వనజనయన
పన్నగేశ్వరశయన యాపన్నవరద
పన్నగేంద్రవిభూషణు-పరమమిత్ర
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 20

తే॥ శ్యామలాంగ జగన్నాధ సాధుపోష
సచ్చిదానంద రూపక స్వప్రకాశ
ఇందిరేశ హృషీకేశ యినకులేశ
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 21

తే॥ దివ్యసాకేత పురివాస దేవదేవ
దివ్యకోదండహస్త వైదేహిరమణ
రత్నవనమాల కౌస్తుభ-భ్రాజివక్ష
సత్కృపామతి బ్రోవుమా జానకీశ 22

తే॥ శరణు శరణు రఘూత్తమ-సరసిజాక్ష
శరణు శరణు కృపాసింధు-సత్యరూప
శరణు శరణు ఖరాంతక-శార్ఙ్గపాణి
శరణు శరణు త్రిలోకేశ-జానకీశ 23

తే॥ శరణు శరణు నారాయణ-చక్రహస్త
శరణు శరణు దైత్యాంతక పరమపురుష
శరణు శరణు జనార్దన చారుగాత్ర
శరణు శరణు దామోదర జానకీశ 24

తే॥ వందనము నీకు రాఘవా వనరుహాక్ష
వందనము నీకు వైకుంఠ వనధిశయన
వందనము నీకు కేశవా సుందరూప
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 25

తే॥ వందనము నీకు గోవింద వనజనాభ
వందనము నీకు దైత్యారి వాలిదమన
వందనము నీకు రఘుకులాభరణ, రామ
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 26

తే॥ దండకారణ్య వాసుల దైత్యపరుల
భండనంబునఁ గూల్చి యఖండముదము
నొండి మానులకిడిన కోదండపాణి
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 27

తే॥ శరివరద దీనమందార కంజనయన,
ఇందిరాలోల యభవ భోగీంద్ర శయన,
కమల నాభ నారాయణ గరుడగమన,
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 28

తే॥ బ్రహ్మరుద్రేంద్ర తాపస వరులకెవని
దివ్యమాయను దాటంగ దెలియరాదు
అట్టిదేవాదిదేవు ననంతు నిన్ను
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 29

తే॥ కామదర్పాపహర వంద్య కామజనక
కామితార్థప్రదాయక కంబుకంఠ
దురితభంజన గోవింద హరిముకుంద
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 30

తే॥ ఎల్లలోకంబులకు సదా నేలికవయి
సర్వభూతాళి కెల్లను సాక్షివగుచు
విశ్వమెల్లను వ్యాపించి వెలుగునిన్ను
శరణుజొచ్చితిననుబ్రోవు జానకీశ 31

తే॥ ఆగమంబుల ముచ్చిలి యబ్ధిఁ జొరఁగ
నసురుసోమకు బరిమార్చి యాగమముల
ధాతకొసగిన మత్స్యావతార నిన్ను
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 32

తే॥ అమరదానవు లమృతంబు నందఁగోరి
క్షీరవారాశి ద్రచ్చుచో క్షితిధరంబు
క్రుంగ నద్దాని నెత్తిన కూర్మరూప
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 33

తే సురులఁ గికురించి దానవుల్ సుధఁగొనంగ
వారి వంచించి సుధను దేవతల కిడిన
సుమమోహన మూర్తిని నిండుభక్తి
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 34

తే॥ ధరణిజాపగా జుట్టిన దైత్యవరుని
హిరణ్యాక్షుఁ దునుమాడి యవనిబ్రోవ
నాదికోలంబవైన నిన్నమిత భక్తి
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 35

తే॥ స్తంభమందుద్భవించి యద్దైత్యకనక
కశిపుఁ దెగటార్చి ప్రహ్లాదు కరుణఁగాచి
నట్టి శ్రీనారసింహు నిన్నధికభక్తి
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 36

తే॥ ప్రబలుఁడైనట్టి బలిదైత్యు బలమడంచి
శక్రునకు పేర్మి సామ్రాజ్య సౌఖ్యమొసగి
భక్తతతి బ్రోచినట్టి యోవడుగు గుఱ్ఱ !
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 37

తే॥ ధరణి ధవులైన హైహయుల్ ధర్మముడిగి
క్రూరులై సంచరింపంగ వారిదునిమి
రాజదమనుఁడవై వెల్గురామ! నిన్ను
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 38

తే॥ బ్రహ్మ వరదత్త బలమున బంక్తిముఖుఁడు
లోకములనెల్ల గారింప లోకవితతిఁ
బ్రోవ దశరథసూనుఁడై బుట్టినట్టి
యాదినారాయణుఁడ నిన్ను నహరహంబు
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 39

తే॥ కంసచేదీశ సాళ్వాది ఖలులఁద్రుంచి
గోపగోపికలను ముచికుందనరుల
బ్రోచినట్టి శ్రీ గోపాలమూర్తి నిన్ను
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 40

తే॥ అన్న నా చిన్నికృష్ణయ్య మన్నుదినగ
నేల ? యనితల్లి ప్రశ్నింప, లీల, నోరు
దెఱచి విశ్వంబు జూపిన దేవునిన్ను
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 41

తే॥ అనుజ పుత్ర మిత్రుల నాహవమునఁ
జంపఁజాలక పొగిలెడి సవ్యసాచి
చింతలంబాపి ఘనయోగ సిద్ధినొసగి
కరుణగాచిన యోపుణ్య పురుష!నిన్ను
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 42

తే॥ పుడమి హింసావృతఁబయి పొగులుచుండ
బుద్ధభగవానుడై వేడ్క భువిజనించి,
ధర నహింసావ్రతంబు సుస్థాపితంబు
జేసి వెలసిన నిన్ను సుస్థిరతనెపుడు
శరణుజొచ్చితిననుబ్రోవు జానకీశ 43

తే॥ హేరఘూద్వహ దేవేశ హేకృపాళో
హేపరాత్పర పరమేశ హేముకుంద
హేవిభీషణ పోషక హేమహాత్మ
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 44

తే॥ ఆదిమధ్యాంతములు లేక యడరుచుండి
వివిధనామ రూపంబుల వెలసెదీవు
దేవతలకైన నీమాయఁ దెలియఁదరము
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 45

తే॥ లోకజాలము నీకుక్షిలోన నిల్పి
ఈవు బహురూపములతోడ నీజగముల
క్రీడసలుపుట చిత్రంబు రిపువిదారి
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 46

తే॥ పాలమున్నీట భోగితల్పంబునందు,
ఇందిరాదేవితోఁగూడి యింపుమీర
క్రీడలం దేలుచుండెడి ప్రోడవీవు
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 47

తే॥ తనయుఁడొకవేళ తెలియక తప్పుసేయ
తల్లిదండ్రులు ప్రోవరే తప్పుఁగాచి
యటులె నే జేసినట్టి యఘాళిఁ బాపి
సత్కృపామతి బ్రోవుమా జానకీశ 48

తే॥ పవనసుత రాక్షసేశ్వర భక్త శబరి
గృధ్రరాజ యహల్య సుగ్రీవులయెడ
జూపినట్టి దయఁగొంత చూపి నన్ను,
సత్కృపామతి బ్రోవుమా జానకీశ 49

తే॥ కావుమని వేడఁ గరిరాజుఁ గాచినావు;
పుణ్యప్రహ్లాదు నురుకృప బ్రోచినావు;
ఎట్టివాత్సల్యమో భక్తబృందము నెడ !
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 50

తే॥ భక్తతతి జాడలరయుచు వారి నెపుడు
సేమటకఁ బ్రోచుచుందువో యినకులేశ
భక్తతతి కోర్కెలీను కల్పకమవీవు,
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 51

తే॥ భక్తసంతతి నీబహిఃప్రాణమనఁగ
భక్తరక్షణమే నీకు పరమవ్రతము
భక్తపాలన నీవుండ భయముగలదె?
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 52

తే॥ ఆర్తరక్షణ బిరుదు నీకమరియుండ
మూఢులై తుచ్ఛులను వేడఁబుణ్యమేమి?
భక్తులనుబ్రోవ నీకంటెఁబ్రభులు గలరె?
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 53

తే॥ అన్యశరణంబుఁజొరక నిన్నాశ్రయించి
నట్టినన్ బట్టువిడువక దట్టులైన
దుఃఖములనెల్లఁబోకార్చి సుస్థినొసగి
సత్కృపామతి ననుబ్రోవు జానకీశ 54

తే॥ ఏనొనర్చిన యఘములెన్నేనిగలవు;
దురితములబాప నీకంటె నొరులుగలరె?
కాననోదేవ నీపద కంజములను
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ 55

తే॥ భవభయోచ్ఛేదనములు సౌభాగ్యదములు
దుఃఖభంజనములు ఘోర దురితహరము
లవ్యయానందదములు నీయంఘ్రిలగయ
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 56

తే॥ పరమపావని గంగకుఁ బ్రభవభూమి
పద్మనిలయకు లక్ష్మికిఁ బట్టుగొమ్మ
నీరజాసను సేవ్యముల్ నీపదములు
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 57

తే॥ భవజలధి నుత్తరింపంగఁ బడవయగుచు
కలుషతిమిరంబులకు నర్కకాంతియగుచు
వెలయు నీదివ్యపాదారవిందయుగళి
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 58

తే॥ దుఃఖజాలంబు బోకార్చు తోయజాక్షు
దీనతతి నెయ్యమునఁ బ్రోచు దేవుఁడనని
నమ్మి సద్భక్తి నీపాద నళినములను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 59

తే॥ లేరు త్రాతలు, హితులును లేరు లేరు;
నిక్కముగ నన్నుఁ బ్రోచెడి నిర్మలాత్ముఁ
డీవె; నీకంటె నాకు దిక్కెవరు లేరు;
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 60

తే॥ శంకరుఁడగాను నీమంత్రసార మెఱుఁగ;
మానిసతిగాను నీపాద మహిమ మెఱుఁగ;
తెలియఁగాజాలుదునె నీదు దివ్యమహిమ ?
శరణుజొచ్చితినను బ్రోవు జానకీశ 61

తే। కోరసామ్రాజ్య సుఖములఁగోరముక్తి
కోరనైశ్వర్యభోగముల్; కోరెదమది
నీకృపాదృష్టి నాపైన నెమ్మిఁబరపి
సత్కృపామతిఁ నను బ్రోవు జానకీశ 62

తే। కామలోభాదిగుణములఁ గట్టువడక,
దురితముల పొంత పోవక, దుష్టమతుల,
దరిని జేరక వ్యసనాళి దాపుఁ జనక
నిన్ను సద్భక్తి సేవించు నేర్పునొసగి,
సత్కృపామతి నను బ్రోవు జానకీశ 63

తే॥ అల్పమతులు, క్రూరాత్ములు, హాస్యరతులు,
దాంభికులు, భక్తిరహితులు, దర్పమతులు
వ్యసనచిత్తులు, మొదలగువారినుండి
సత్కృపామతిననుబ్రోవు జానకీశ 64

తే॥ భక్తవరులు, పుణ్యాత్ములు, భవ్యతనులు
దురితదూరులు, ప్రాజ్ఞులు, కరుణామతులు
మాన్యులైన నీభక్తుల మైత్రినొసగి,
సత్కృపామతిఁ బ్రోవుమా జానకీశ 65

తే॥ నీపదాంభోజ సేవయు, నీకు భక్త
సంగతియు, నిర్మలజ్ఞాన శమదమములు,
సర్వభూత సమత్వంబు, శాంతినొసగి,
సత్కృపామతిబ్రోవుమా జానకీశ 66

తే॥ నీదుగుణవృత్తముల భక్తి-నియతినెపుడు
కీర్తనముఁజేసి జన్మంబు-సార్థకంబు
జేసికొనగోరినాడ నో శేషశయన
సత్కవిత్వంబు దయసేసి సాదరమున
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 67

తే॥ కామలోభాది దుర్గుణ కలితుఁడగుచు,
కన్నులుండియు మూఢుండు గానలేఁడు
నిఖిలవిశ్వంబు నిండిన నీమహామూర్తి
సాధుజనవత్సలా! దేవ! జానకీశ! 68

తే॥ అవనిలోఁగల్గు సృష్టి రహస్యములను,
భూతతతి వృద్ధిలయములఁ బొందుగతిని,
నెఱుగగల్గిన దత్త్వజ్ఞుఁ డెఱుఁగునిన్నుఁ;
సాధుజనవత్సలా! దేవ! జానకీశ! 69

తే॥ ప్రకృతి యెల్లను నీస్వరూపంబ యగుట
ప్రకృతి జన్యంబులౌ సర్వవస్తునిచయ
మంత నీమూర్తి బొడగను నటులఁ జేసి
సత్కృపామతి బ్రోవుమా జానకీశ. 70

తే॥ మంత్రములకెల్ల నీనామ మంత్రమైన
తారకంబెగదా ముక్తిదాయకంబు;
వారిజాక్ష నిన్ బోలు దైవంబు గలడె ?
సత్కృపామతి బ్రోవుమా జానకీశ. 71

తే॥ జపతపంబుల యోగాది సద్వ్రతముల
దేహముకృశించుటగాని తెలియదరయ
భక్తిచేనిన్ను దెలిసెడిభంగి ? దేవ !
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 72

తే॥ అభ్యసింపంగనైతిని యాగమముల,
నరయనైతిని సాంఖ్య యోగాది వితతి,
దివ్యమంగళమూర్తినిన్ దెలియగోరి
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 73

తే॥ చిక్కవిందిర కౌగిటఁ; జిక్కవీవు
యోగవిభులైన సనకాది యోగులందు;
భక్తవరులందు జిక్కెడి భంగి, నిన్ను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ. 74

తే॥ ఇభవరుఁడు సల్పెమున్న దానెట్టితపము ?
ఘోషకాంతలు సల్పిరే ఘోరతపము ?
భక్తిచేనిన్ను గాంచిరి భవ్యచరిత;
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ 75

తే॥ భక్తసులభుండ వనినిన్ను బరమమునులు
బ్రస్తుతులు సేయ నీపాద పద్మములను
బరిమలంబైన భక్తి భావంబుతోడ
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 76

తే॥ ఎంతవేడినగాని నీహృదయమింత
కరగఁడే ? జాలిలేద ? నగాగావలేవ ?
ఆర్తులను బ్రోవకుండుట న్యాయమగున ?
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 77

తే॥ విషధరము పాన్పు మిత్రుండు విషగభుండు
విషధి వేశ్మంబు ఫలము న్నవేడ నిన్ను ?
విరచిత్తంబు నియుంద హాత్తియుంట
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ. 78

తే॥ నాదు దుష్కృత ఫలితంబు-నన్ను వెతలఁ
బెట్టు, నిన్ దూరుటెల్ల నా-వెఱ్ఱితనమె;
దేవ! నాదుష్కృతావళిఁ దెళ్ల జేసి
సదయహృదయత బ్రోవుమా జానకీశ 79

తే॥ కష్టముల కోర్వలేకనిన్ - గసరినాడ
నంతయుగాని నీయెడ నుంతయైన
నలుక లేదయ్య నీవవ- తాప్రఘ్నులావ
సదయహృదయత బ్రోవుమా జానకీశ. 80

తే॥ ధనమదంబున నధికార దర్పమునను
విఱ్ఱవీగుచు వర్తింపు వెడగుమతుల
జేరి వారల సేవలు- సేయ నెపుడు
సత్కృపామతిం బ్రోవుమా జానకీశ. 81

తే॥ అల్పులైనట్టిమనుజుల నాశ్రయించి
వారి మెప్పింప పలువెతల్-బడుటకంటె,
ప్రేమనిధివైన నిన్ను సేవించుభక్తి,
సత్కృపామతిం బ్రోవుమా జానకీశ. 82

తే॥ పద్మగంధంబు మరగిన భ్రమరవితతి
యన్యకుసుమంబుం జేరని యట్లు నీదు
ధ్యానరతుడ నన్య దైవంబు దరికి జనను;
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ. 83

తే॥ ఆశ్రితావళి పాలిటి యమరభూజ
మైననిన్ వీడి కొలువ నే నన్యదైవ
ములను; నీపాద పంకజములను భక్తి
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 84

తే॥ సర్వచింతలవీడి నీ శరణుజొచ్చి
నట్టినన్నెట్లు బ్రోచెదో యార్తిబాపి
వనధిముంచెదో ? మఱిలేక పాలదేల్తొ ?
సాధుజనవత్సలా ! దేవ ! జానకీశ ! 85

తే॥ భక్తతతికోరిక లెఱింగి వారిబ్రోవ
నీదు కర్తవ్యమగుటనే నిన్నువేఱ
యభిమతార్థంబు లిమ్మని యడుగనేల
సాధుజన వత్సలా ! దేవ ! జానకీశ ! 86

తే॥ ఆగమాంత సంచారుఁడవైన దేవ
బ్రహ్మరుద్రేంద్రులకు నైనఁ బట్టరాని
మూలమూర్తివై భాసిల్లు పుణ్యపురుష
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ. 87

తే॥ కర్మమున ప్రాణితతియెల్లఁ గట్టువడుచు
ప్రాప్తమౌ కష్టసుఖములఁబడుచు నిన్ను
దెలిసికొనలేక దుర్గతిఁ దెళ్ళుచుండు
సాధుజనవత్సలా ! దేవ ! జానకీశ ! 88

తే॥ భక్తివిజ్ఞాన కలితులై-భాగవతులు
కర్మబంధంబులన్ ద్రెంచి కాంతురెపుడు
అవ్యయానంద బ్రహ్మంబవైన నిన్ను
సాధుజనవత్సలా ! దేవ ! జానకీశ ! 89

తే॥ పూర్వభవ కర్మపటలంబుఁ- బోనడంచి,
ద్వంద్వములయందు సమబుద్ధి దగులఁజేసి,
భక్తివిజ్ఞాన వైరాగ్య-యుక్తుజేసి,
సదయహృదయత నను బ్రోవు జానకీశ 90

తే॥ ఎన్ని యోజన్మముల నెత్తి యింతదనుక
దెలియలేనైతినీదగు దివ్యమహిమ
మనుపమంబైన భక్తి నిండైన నొసగి
సత్కృపామతి బ్రోవుమా జానకీశ 91

తే॥ నిర్గుణుఁడవయ్యు గుణివయి నెగడెదీవు
రూపరహితుండ వయ్యు వేరూపములను
దాల్చిక్రీడించు నీమాయ దాటవశమె ?
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 92

తే॥ వరసుషుమ్నాంతరస్థుని స్వప్రకాశు
మానిహృత్తోషకరు బరమాత్ము, నిత్య
మోక్షదాయకు నిర్గుణ మూర్తి నిన్ను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 93

తే॥ తత్త్వమస్యాదిలక్ష్యమై తనరుమూర్తి,
నాదరూపుండవై నయానందమూర్తి,
విమల బ్రహ్మస్వరూపమై వెలుగుమూర్తి,
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ. 94

తే॥ సూక్ష్మ మౌవస్తువున కంటె సూక్ష్మమగుచు
మహితమౌ వస్తువునకంటె మహితమగుచు
నీయజాండంబు వ్యాపించి యెసగునిన్ను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 95

తే॥ మూగురుమూర్తులకును మూల మూర్తి వీవు
మూడుగుణముల కవ్వలి మూర్తి వీవు
వివిధ తత్వార్థ లక్ష్యమై వెలసెదీవు
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ ! 96

తే॥ నిర్గుణంబు, నిర్ద్వంద్వంబు, నిరుపమంబు
నిర్వికల్పంబు, సత్యంబు, నిర్మలంబు,
నిగమవంద్యంబునై యొప్పు నీసుమూర్తి
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 97

తే॥ అలసహస్రార పద్మమధ్యంబునందు
ప్రణవనాదరూపుండవై ప్రజ్వరిలుచు
దివ్యయోగీంద్ర నుతుడవౌ దేవ నిన్ను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ ! 98

తే॥ సత్వగుణు మోక్షదాయకుఁ బరమపీఠ
నిలయుఁ బరరూపుఁ బరమాత్ము నీరజాస
నాదిసుర సేవ్యు భవరోగహరు నిన్ను
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ ! 99

తే॥ వేయుశిరములు కరములు వేయిగల్గి
వేయిపదములు నేత్రముల్ వేయువెలయ
వేయిసూర్యుల కాంతితో వెలుగునిన్ను
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 100

తే॥ ఎవడు దనమాయచేత నీ భువనములను
సృష్టిజేసి పోషించి నశింపజేసి
లీలమోదించునట్టి శ్రీ లోలునిన్ను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ. 101

తే॥ ఆత్మయేనీవు నాదేహ మాలయంబు
బుద్ధియే నీదు జాయ యగా పుడమితనయ
యసువులేనీదు పరిజనులనుచు నెంచి
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ ! 102

తే॥ పద్మభవ భర్గ నిర్జర పతులకైన
దెలియగారాదు నీమాయ దేవ దేవ !
అల్పమతినైన నేనెట్లు గరుగగలను ?
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ ! 103

తే॥ సారహీనంబు భవసుఖ సంయుతంబు
విషయసక్తంబు క్రోధాది భీకరంబు
నైన సంసారదుఃఖంబు సహనయించి
శరణుజొచ్చిన, నను బ్రోవు జానకీశ ! 104

తే॥ జీవితార్ణవమందున జిక్కి వివిధ
దుఃఖవీచికలం గ్రుంగి తూలఁగినధృతి
వదలునట్టు బ్రోతువనెడి కొండంతయాశ
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ ! 105

తే॥ జీవితాబ్ధి మధ్యంబున-జిక్కి మిగుల
సంచలించెడి నాదు సంసారనౌక
గాచిదరిఁజేర్చి రక్షించు కర్ణధార
కుడవు నీవొక్కరుండవే-కువలయాక్ష !
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ 106

తే॥ జీవితము బుద్బుదంబు సుస్థిరముగాదు;
ఎప్పుడెట్టుల నేగునో యెరుగరాదు,
కావనిప్పుడె నీపద కంజములను
శరణు జొచ్చితి నను బ్రోవు జానకీశ ! 107

తే॥ దారసుతబంధు మిత్రముల్-ధనగృహాది
యైహికంబగు భోగంబు-లస్థిరములు;
నీపదాంబుజ సేవయే నిత్యమరయు;
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ ! 108

తే॥ తనువు విడనాడి జీవుండు తలగువేళ
నిన్ను స్మరియింప నేర్తునో-నేర్వలేనొ
కానిప్పుడె నీనామ-ధ్యానమొసగి
సత్కృపామతిఁ బ్రోవుమా జానకీశ 109

తే॥ యముని పాశంబులం జిక్కి-యడలువేళ
దారసుత బంధుమిత్రులు-దరికిరారు
అపుడు నాపాసటగ నిల్చి-యార్తిఁ బాప
శరణు జొచ్చితి ననుబ్రోవు జానకీశ 110

తే॥ క్రూరులైనట్టి రావణ కుంభకర్ణు
లాదిగాగల్గు యసురుల హతమొనర్చి
భువనముల నెల్లఁ బ్రోచిన పుణ్యమూర్తి
శరణుజొచ్చితి ననుబ్రోవు జానకీశ. 111

సీ. సీతవామాంకమున బీఠిఁ జెన్నుమీఱ
భరతలక్ష్మణలవణారు-లరసికొల్వ
వాయుసూనుండు పాదముల్ బట్టుచుండ
సూర్యసుతు రాక్షసేశ్వర-సూరిజనులు
కౌశికవసిష్ఠ వాల్మీకి గౌతమాది
మానివృషభులు మంత్రి సామంత నృపులు
పౌరజనములు భటులు సద్భక్తవరులు
చేరి యాదమున సేవింప-సింహపీఠి
వెలసి పేరోలగంబున్న వేదవేద్య
రాజవరు ధీరు పట్టాభిరాముని నిన్ను
శరణుజొచ్చితి నను బ్రోవు జానకీశ. 1[illegible]

శా. హేసీతాఘన! హేదయాజలనిధే! హేభక్తచింతామణే
హేసర్వాత్మక! హేయహల్యవరదా!
హేయజ్ఞ-వాశాగ్రణే!
హేసుగ్రీవ మరుత్సుతార్చితపదా!
హేపద్మపత్రేక్షణా
హేసర్వేశ! భజామి త్వాం రఘుపతే!
హేరామచంద్రప్రభో! 113

శా॥ వందే నీరజలోచనం శివనుతం వందే కృపాసాగరం

వందేభక్తజనౌఘకల్పకతరుం- వందేఘనశ్యామలం

వందేమారుతిసేవితం గుణనిధిం-

వందేమునీంద్రార్చితం

వందేజానకి మానసాబ్జమధుపం-

వందేగురుంరాఘవం॥ 114

ఉ॥ రాముఁడె తల్లిదండ్రి, రఘు రాముఁడె

భ్రాతయు, నాప్తబంధుఁడున్

రాముఁడె, కూర్మిమిత్రుఁడును రాముఁడె,

యొజ్జయురామచంద్రుఁడే

రాముఁడెసర్వరక్షకుఁడు, రాముఁడె

దైవము, ప్రేమతోడనా

రాముని నామమంబున నిరంతరముం

వసియించుగావుతన్ 115

సీ॥ చిన్నిపాపండయ్యు-చెనటిదైత్యులఁగూల్చి
కౌశికుయాగంబు గాచె నెవఁడు?
పావనంబగునిజ-పాదరజంబుచేఁ
బడఁతిశాపంబును-బాపె నెవఁడు?
భుజదర్ప మేర్పడ-బురహరువిలుద్రుంచి
యవనిజాఁ జేపట్టి-యలరె నెవఁడు?
బలధైర్యశౌర్య సంపత్తి-భార్గవుఁగెల్చి
క్షితిరాజములను, రక్షించె నెవఁడు?
అమితకృపమోక్షమొసగె బోయతకు నెవఁడు ?
ఇనజుఁగపిరాజ్యపదమున నునిచె నెవఁడు?
మారుతాత్మజు సప్రేమ మనిచె నెవఁడు ?
రావణానుజు లంకకు రాజుఁజేసి
భక్తతతిఁ బ్రీతిఁబ్రోచిన-ప్రభుఁడెవండు ?
అట్టిసాస్వామి రఘురాము-నాశ్రయింతు. 116

సీ॥ నీచరణంబులే-నిఖిలలోకములకు
శరణంబులైయొప్పె-సరసిజాక్ష !
నీనామమంత్రంబె-నిఖిలలోకముల
తారకమంత్రమై-తనరె నీశ !

నీపుణ్యచరితలే-నఖిలలోకములకు
భవహరణంబులై - పరగెనభవ।
నీపూజనంబులే-నిఖిలలోకములకు
ముక్తిమార్గములయ్యె-పుణ్యపురుష।
నీదుసేవయె నాపుణ్యనిధియటంచు
నమ్మినీదివ్యమూర్తిని నాదుహృదయ
పీఠముననిల్పి పూజింతుఁ-బ్రేమతోడ
సత్కృపాంమతిఁ బ్రోవుమాజానకీశ. 117

సీ। సౌందర్యరాశియౌ-జానకీదేవిని
సహధర్మిణిగనిచ్చె-జనకరాజు,
ఆదరంబుననిచ్చె-నస్త్రసంతతినెల్ల
ఘనతపోమహిముఁడౌ-కౌశికుండు,
అవనిజ జాడల నారసయేతెంచి
యామెసేమము చెప్పె ననిలజుండు,
జానకింబడయంగ-సర్వసాహాయ్యంబు
నాదరంబునఁజేసె-సర్కజుండు
ధన్యతములైరివారలీ ధరణియందు
నేనుజేసెడి సాహాయ్య-మేదినీకు ?
ఐననొసగెద నీవాక్పుష్పమాలు
సత్కృపంగొని బ్రోవుమా- జానకీశ. 118



# శ్రీరామ దండకము



శ్రీ జానకీ మానసాంభోజ మిత్రా। పవిత్రా। సుచారిత్ర। కౌసల్యపుత్రా। రఘూత్తంస। శ్రీరామ। శ్రీ వాసుదేవాచ్యుతా। పద్మనాభా। హృషీకేశ। నారాయణా। మాధవానంత। దామోదరా। భక్త దుఃఖాపహారా। దయాసాగరా। మందరోద్ధార। గోవింద। గోపాల। శౌరీ। మురారీ। హరీ। పన్నగాధీశ తల్పా। జగన్నాథ। దేవేశ। నీదివ్య లీలావిశేషంబులన్ సన్నుతింపంగ నా బ్రహ్మరుద్రేంద్ర బృందారకుల్ జాల రన్నంగ నేనెంతవాడన్? విదేహాత్మజాధీశ। బాలుండవై యుండియున్ దానవిన్ దాటకిన్ ద్రుంపలేదా? సుబా హ్వాది మాయావులా దానవానీకమున్ద్రుంచి గాధేయు జన్నంబుఁ గాపాడలేదా? పవిత్రంబులైనట్టి నీపాద రేణు ప్రసారంబుచే రాతినిన్ నాతిగాన్ జేయలేదా? ధరానాథులెల్లన్ భయభ్రాంతులై చూడ గాధేయుఁ డుప్పొంగ గౌరీశుచాపంబు దోర్లీల భంగంబు గావించి లావణ్య తారుణ్య లీలావిలాసంబుల న్నెంతయు న్నొప్పు

శ్రయింపఁగఁ గారుణ్యమొప్పార నక్తంచర శ్రేష్ఠు మన్నించి
బ్రోవంగ లేదా ? కపివాహినిమున్ గూడి సంద్రము
నత్యంత శీఘ్రంబుగా దాఁటి లంకాపురిం జొచ్చినం గాంచి
యా రావణుండాగ్రహోదగ్రుఁడై శూరులైనట్టి రాత్రిం
చరాధీశులం జైన్యయుక్తంబుగా సంగరక్షోణికిం బంపినన్
వారలం దెంచి యొక్కుమ్మడిం దాకినన్ ధైర్యమున్నీవ
నత్యంతకోపంబునన్ వజ్రసంకాశమౌ దివ్యబాణంబులన్
వారి ప్రాణంబులం బాపఁ గాలేద? ఆయింద్రజిత్తుండు
మాయావియై యంబరమ్మున్ బ్రవేశించి దివ్యాస్త్ర
జాలంబుచేఁ గీశసంఘంబు నొప్పింపఁగా నాంజనేయా
న్వితుండైన సౌమిత్రి ధన్వంబధిజ్యమ్ముగావించి రక్షో
వరుల్ భీతిఁగుందంగ నాదిత్యులుప్పొంగ దివ్యాస్త్రముల్
దొడ్గి వైరిన్విలోకించి వైవన్ దదస్త్రంబు తీవ్రానల
జ్వాలలన్ గ్రక్కుచున్ వైరివీరుల్ విలోకింపరానట్టి తే
జోవిశేషంబుచే నొప్పుచున్ మన్నునిస్తేజమై యేఁగి
యయ్యింద్రజిత్తున్ రణక్షోణిఁ గూల్పంగ వీక్షించి యా
హ్లాదముం బొందలేదా ? దశాస్యుండు రోషించి శక్తిం
బ్రయోగింప నాశక్తిచే మూర్ఛఁ గొన్నట్టి సౌమిత్రినిం
గాంచి యత్యంత సంతాపముం జెంద సద్భక్తునా

కీశక వ్రాతమున్ బంపగా నంజనీ పుత్రుండా దక్షిణాబ్ధిన్
వడిన్ దాటి లంకాపురింజొచ్చి సీతామహాదేవికై వాడ
వాడవిలోకించి యెచ్చోటునుంగాన కత్యంత శోకంబుచే
నాయశోకాఖ్య వొప్పారు నుద్యాన సీమన్ వెసన్ జొచ్చి
యయ్యశోక వృక్షంబు మూలంబునన్ మూర్తిగొన్నట్టి
శోకంబు చందంబుగా నొప్పుచున్ బెబ్బులుల్ చుట్టి
యున్నట్టి లేడిన్ వలెన్ దానవీమూక మధ్యంబునందున్న
యాబాలామణింబునున్ గాంచి, యాదేవియే సీత గా నెంచి
తీవ్రమౌ మ్రొక్కు దెల్పి మీయుంగరిన్ భక్తితో నిచ్చి మీ క్షే
మముల్ దెల్పి యాదేవి చూడామణిన్ గొంచు నేతెంచు
వేళ స్వనం బెల్ల ధ్వంసంబు గావించి మాయావులౌ రాక్షసా
నీకమున్ గూల్చి లంకాపురిన్ గాల్చి యేతెంచి మీ పాద
పద్మంబులన్ భక్తి సేవించి భూపుత్రి వృత్తాంతమున్
జెప్పినన్ మోదమున్ బొందలేదా? కపివ్రాతముల్
గొల్వ సుగ్రీవ నీలాంజనేయాంగదాదుల్ మహాభక్తితో
పాయమై వెంటరాలక్ష్మణుం గూడి యాదక్షిణాబ్ధిన్ వడిం
జేరి వారాశిగర్వంబు మాయించి యానీలుచే సేతువున్
వేగనిర్మింపగాం జేయలేదా? మహాభక్తితో మీదు
పాదాంబుజ ద్వంద్వమే సర్వసంపత్కరంబంచు మిమ్మా

గారుణ్యచిత్తంబునన్ వారిచింతల్ గృపంబాపి కోదండ
టంకారమున్ జేసి దివ్యాస్త్రరాజిన్ నిగుడ్పగ రా
త్రించరుల్ నుగ్గునూచై రణోర్విన్ బడంజూచి గోపించి
యాకుంభకర్ణుండు మిమ్మున్ వడిన్ దాకి నానాస్త్ర జా
లంబుచే నొంచినన్, వానిగై కొక లోకంబులెల్లన్ భ
యభ్రాంతమై చూడ బ్రహ్మాస్త్రమున్ వైచినన్ వాడు
దద్ఘోర బాణాగ్ని భస్మీకృతాంగుడునై నేలగూలన్
గపిశ్రేణు లార్చెన్ సురల్ ఖేదముల్ బాసి సమ్మోద
మొప్పార మిమ్మర్చనల్ సేయలేదా? రణక్షోణిపుత్రా
ప్తమిత్రానుజుల్ గూలినన్ దైన్యముంబొంది దైత్యేంద్రు
డుద్దండతన్ సర్వసైన్యంబు సన్నద్ధముం జేసి దివ్యాస్త్ర
సందోహముల్ దాల్చి యుక్తంబుగా వస్త్రమాల్యాను
లేపంబులన్ బ్రీతిగై సేసి గౌరీశు సద్భక్తిబూజించి తె
క్కంపరానట్టి సైన్యంబులంగొంచు యుద్ధావనిం జొచ్చి
పుంఖానుపుంఖంబుగా నస్త్రసందోహమున్ వైచి తూ
టాడినన్ వానరుల్ దైన్యతంగుంది "ఓ రామ! శ్రీ
రామ! శ్రీ జానకీరామ! రక్షోవిరామా! దురాత్మున్
దశగ్రీవు డున్మాడి, నీదాసులన్ మమ్ముగాపాడవే!"
యంచు వేడన్ వడిన్ వారి సంతాపముందీర్చ దివ్యా-

ష్ట్రజాలంబుచే రావణుం గాసిలంజేసినన్ వాఁడుదర్పిం
చి లావింతయున్ వీడకత్యంత శౌర్యోద్ధతిన్ దాకి క్రొవ్వా
డి బాణంబులన్ మిన్ముఁగాసిల్లగాఁ జేసినన్ రౌద్రతన్
గ్రూరనారాచ వర్గంబుచే దైత్యసంఘంబుఁ దూటాడి
దోషాచరశ్రేష్ఠు నొప్పించి దర్పించినన్, వాఁడు చొప్పిం
తయున్ దప్పకా వెంటనే మాఱునొప్పించినన్, కాలరు
ద్రాకృతిన్ వైరి సంఘంబుచుం దున్మి రాత్రించరాధీశు
నా రావణున్ వెంటనేమున్న బ్రహ్మాస్త్రమున్ వింటసంధిం
చి సంశుద్ధ చిత్తంబుచే వైవ నయ్యస్త్రరాజంబు భూ
మ్యాంతరిక్షంబు లేకంబుగానిండి తీవ్రానల జ్వాలలన్ గ్ర
క్కుచున్ దృష్టికి వెక్కసంబై యరిత్రాత మత్యంతమూ
ర్ధాభపరత్వంబుచే భండనక్షోణి సేసుల్ వడిన్ వాల్చ
గానేగి దైత్యాంగసీసం దాకినన్ వాఁడు నిర్వీర్యుఁడై వజ్ర
నిర్భిన్న పక్షంబులై క్షోణిపై వ్రాలు క్షోణీధరంబట్లు
ప్రాణంబులంబాసి యుద్ధావనిం గూలగా లోకముల్
సంతసిల్లెన్ దిగీశాది బృందారకుల్ మోదిత స్వాంతులై
దుందుభి వాద్యముల్ మ్రోయ రంభాది వేశ్యాంగనల్
లాస్యముల్ సల్ప, కల్పప్రసూనాళి వర్షించి సద్భక్తి
మీపాదపద్మంబులం గొల్వగాలేద ? ప్రేమాంతరంగం

బుచే భక్తుఁడా రాక్షసేంద్రానుజున్ లంకకున్ రాజుగాఁజేసి
మీభక్తవాత్సల్యముం దెల్పఁగా లేద? దైత్యేంద్రుని
ర్బంధమందున్న సీతామహాదేవి సౌశీల్యమున్ సంశయిం
పంగ నాదేవి యగ్నిం బ్రవేశింప నాసప్తజిహ్వుండు శ్రీ
జానకిం దెచ్చి మీకిచ్చి యాదేవి సౌశీల్యముం సర్వసేనా
సమక్షంబునన్ జాటినన్ భూమిజం బ్రీతిఁ జేపట్టి సుశ్లో
మయానంబు నాపుష్పకారూఢులై వచ్చి ప్రీతిన్నయో
ధ్యాపురిం జొచ్చినన్ మాతలున్ భ్రాతలున్, మంత్రులు
న్ బౌరులున్, మానులున్ భక్తులున్, హర్షబాష్పాళి చె
క్కిళ్ళపై రాల మీదివ్యసందర్శనక్షాళితాఘౌఘులై మీ
స్సుచారిత్రముల్ నెమ్మి గీర్తింపలేదా? సతీరత్నమా
జానకీదేవి వామాంకపీఠంబు నంకొప్ప సౌమిత్రి శ్వేతా
తపత్రంబుఁ బట్టంగ, కైకేయి సూనుండు శత్రుఘ్నుఁడున్
రెండు పార్శ్వంబులన్ నిల్చి సద్భక్తి వింజామరల్ వీవ
న్నాయాంజనేయుండు సంప్రీతి పాదంబులన్నొత్త సుగ్రీవ
నీలాంగదుల్, భల్లుకేశుండు, రాత్రించర శ్రేష్ఠుండున్
సర్వయోగీంద్రులున్ భక్తులున్ బౌరులున్ జేరి సద్భ
క్తి సేవింప రాజ్యాభిషిక్తుండవై యుండి ప్రేమోల్లేఁ బ్రజన్

బోఁచి మన్నింపలేదా ? కృపాసాగరా ! జానకీనాథ !
శ్రీరామ ! నిన్ సన్నుతింపంగ నాపద్మగర్భుండు, రు
ద్రుండు, శేషుండు, కాత్యాయనీ దేవియున్ జాలరో
దేవ ! ఆ సోమకుండాగమ వ్రాతమున్ గొంచు నబ్ధిన్
జొరన్ మీనుమేనన్ విరోధిన్ నిరోధించి సాధించి వేదం
బులన్ వేధకున్ వేల్పులగ్గింపగా నీవె ! దేవాసురుల్
పాలమున్నీరుద్రచ్చంగ నమ్మందరంబబ్ధిఁ గ్రుంకన్ మహా
కూర్మ రూపుండవై యద్రిఁ బైకెత్తవే ! ఆ హిరణ్యాక్షుఁ
డుద్దండ గర్వాతిరేకంబునన్ ధారుణిం జాపగాఁజుట్టి పా
తాళముం జొచ్చినన్ వానిఁగ్రోడంబవై దన్ని విశ్వంభరన్
గొమ్మునన్నెత్తి రక్షింపవే ! బాలుడౌ భక్తు బ్రహ్లాదు
వాక్యంబుఁ బాలింప స్తంభంబునన్ నారసింహుండవై
పుట్టి దైత్యేంద్రునిం బట్టి శిక్షింపవే ! శౌర్య తేజో విశే
షంబులన్ నిర్జరేంద్రాది దిక్పాల సంఘంబులన్ లీల ని
ర్జించి త్రైలోక్య సామ్రాజ్యముం బొంది యత్యంతమౌ సా
హసౌదార్య తేజంబుల న్వెల్గు వైరోచనుం వేడి పావత్రి
యుం బాఘరన్ బొంది బ్రహ్మాండమున్ నిండి భూమ్యంత
రిక్షంబులన్ రెండు పాదంబులం గొల్చి వేరొక్క పాదంబు
దైత్యేంద్రు శీర్షంబునన్ మోపి పాతాళము న్నంటగా

దొరికి స్వారాజ్య పీఠంబునన్ శక్రునిన్ నిల్పి రక్షింప
వే? దుర్మదోద్రేక రాజన్యలోకంబు నత్యంత దర్పోద్ధతిన్
దాకి ముయ్యేడుమారుల్ గుఠారంబునన్ జామదగ్న్యుండ
వై ద్రుంపవే? రామచంద్రుండవై రావణున్ బుత్ర మి
త్రానుజ వారిత యుక్తంబుగాఁ ద్రుంపవే? వాసుదేవుండ
వై దుష్టులౌ కంసచేదీశ సాళ్వాది భూనాథులం ద్రుంచి
భక్తాళికిన్ భద్రముల్ గూర్చి కాపాడవే? బుద్ధదేవుండ
వై మేటిధర్మం బహింసావ్రతంబంచు భూమండలంబెల్ల
జాటించి దేశంబునన్ శాంతి సద్ధర్మముల్ నిల్పవే? ధారు
ణిన్ కల్కి మూర్తిన్ బ్రవర్తిల్లి ధర్మంబు స్థాపింపఁగారావె?
ఓదేవ! నిన్ సన్నుతింపంగ నాబోటికిన్ శక్యమే? మూఢ
చిత్తుండ, రాగాదిబద్ధుండ, స్వల్పజ్ఞుఁడన్, నీదుమాయా
విమోహాంతరంగుండనై సత్యముంగానఁగాలేక భార్యాసు
తా రామగేహంబులున్ భోగముల్ నిత్యశ్రేయంబులం
చాత్మలో నెంచి సంసారవారాశిలోఁ జిక్కి సంతాప సం
తప్త చిత్తుండనై యున్న నన్నుద్ధరింపంగ నీదివ్య పద్మాం
ఘ్రి సంసేవనం బే సమర్థంబు వేరెవ్వరిన్ వేడ నన్నున్
విపన్నున్ గృపన్ జూచి, నీపైనసద్భక్తియున్ సజ్జ

ప్రాత సంసేవయున్, జ్ఞానమున్ శీలమున్ శాంతమున్ దాంతమున్ సత్యమున్ ధర్మమున్ సర్వభూతాళిపై నిర్మల ప్రేమయున్ నీదులీలా విశేషంబులన్ సన్నుతింపంగ సద్వాణియున్ సద్యశంబున్ గృపాయత్త చిత్తంబునన్నిచ్చి నాపాపపుంజంబులం బాపి, దుఃఖంబులన్ మాపి, దైన్యంబులన్ దూల్చి, యజ్ఞానమున్ గూల్చి, మాత్సర్యమున్ మాన్చి, క్రోధాదులన్ గాల్చి, రాగాదులన్ రాల్చి, రోగాదులం దున్మించి జన్మాదులన్ జీల్చి భద్రంబులంగూర్చి నాజన్మసాఫల్యముం జేసి రక్షింపవే భక్తచింతామణీ! పాహిమాం! పాహిమాం! పాహిమాం! రామచంద్రా! నమస్తే, నమస్తే, నమస్తే నమః.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.



తే॥ సర్వధారి సంవత్సర చైత్రశుద్ధ
నవమి శనివార పుణ్యదినమ్ము నందు
జరుగు శ్రీ రామ నవమి యుత్సవము వేళ
భక్తి గృతి నిచ్చితిన్ రామ భద్రునకును.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ. | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| (ii) | విన్నపము | కైవశం. | కైవసం. |
| | ,, | కించిజ్ఞత | కించిజ్జ్ఞత |
| (iii) | ,, | దక్షణాంబ | దక్షిణాంబ |
| | ,, | దెలియక నే | దెలియక యే |
| | ,, | మన్నిచి | మన్నించి |
| | ,, | నానందాశ్రు | నానందాశ్రువు |
| | ,, | కర్పించుకొంటిని | కర్పించితిని |
| 2 | 3 | డోసగును | డోసంగును |
| 4 | 11 | వసుధేశుడు | వసుధేశుడు |
| 5 | 17 | | దేవేంద్రారి |
| 9 | 26 | ధవళమ్మై | ధవళమై |
| | ,, | భ్యారసతుడ | భ్యాసరతుడ |
| 10 | 3 | దుగ్ధవరాశి | దుగ్ధవారాశి |
| 12 | 12 | పావసంబైన | పావనంబైన |
| 13 | 18 | శుశ్లోకు | సుశ్లోకు |
| 15 | 30 | ప్రదాయక | ప్రదాయక |

ప్రాత సంసేవయున్, జ్ఞానమున్ శీలమున్ శాంతమున్ దాంతమున్ సత్యమున్ ధర్మమున్ సర్వభూతాళిపై నిర్మల ప్రేమయున్ నీదులీలా విశేషంబులన్ సన్నుతింపంగ సద్వాణియున్ సద్యశంబున్ గృపాయత్త చిత్తంబునన్నిచ్చి నాపాపపుంజంబులం బాపి, దుఃఖంబులన్ మాపి, దైన్యంబులన్ దూల్చి, యజ్ఞానమున్ గూల్చి, మాత్సర్యమున్ మాన్చి, క్రోధాదులన్ గాల్చి, రాగాదులన్ రాల్చి, రోగాదులందున్రించి జన్మాదులన్ జీల్చి భద్రంబులం గూర్చి నాజన్మసాఫల్యముం జేసి రక్షింపవే భక్తచింతామణీ! పాహిమాం! పాహిమాం! పాహిమాం! రామచంద్రా! నమస్తే, నమస్తే, నమస్తే నమః.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.



తే॥ సర్వధారి సంవత్సర చైత్రశుద్ధ
నవమి శనివార పుణ్యదినమ్ము సందు
జరుగు శ్రీ రామ నవమి యుత్సవము వేళ
భక్తిఁ గృతి నిచ్చితిన్ రామ భద్రునకును.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ. | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| (ii) | విన్నపము | కైవశం. | కైవసం. |
| | ,, | కించిజ్ఞత | కించిజ్జ్ఞతి |
| (iii) | ,, | దక్షణాంబ | దక్షిణాంబ |
| | ,, | దెలియక నే | దెలియక యే |
| | ,, | మన్నిచి | మన్నించి |
| | ,, | నానందాశ్రు | నానందాశ్రువు |
| | ,, | కర్పించుకొంటిని | కర్పించితిని |
| 2 | 3 | డాసగును | డాసంగును |
| 4 | 11 | వశుధేశుడు | వసుధేశుడు |
| 5 | 17 | | దేవేంద్రారి |
| 9 | 26 | ధవళమ్మై | ధవళమై |
| | ,, | భ్యారసతుడ | భ్యాసరతుడ |
| 10 | 3 | దుగ్ధవరాశి | దుగ్ధవారాశి |
| 12 | 12 | పావసంబ్తైన | పావనంబైన |
| 13 | 18 | శుశ్లోకు | సుశ్లోకు |
| 15 | 30 | ప్రదాయక | ప్రదాయక |

| పేజీ | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 34 | సురుల | సురల |
| 20 | 50 | పుణ్య | పుణ్యు |
| 21 | 52 | భక్తపారీణ | భక్తపాలన |
| 22 | 56 | భవభయాచ్ఛేదన | భవభయచ్ఛేదన |
| 28 | 80 | సంతయే | సంతియే |
| 29 | 85 | ననెట్లు | నన్నెట్లు |
| 31 | 94 | లక్ష్యమ్మై | లక్ష్యమై |
| 34 | 104 | సపనయించి | నపనయించి |
| 36 | 113 | హేయహల్య | హేఅహల్య |
| | | హేయర్క | హేఅర్క |
| 38 | 116 | లోకముల | లోకములకు |
| 40 | దండకము | సుబాహ్వాది | సుబాహ్వాది |
| 42 | ,, | వారాగశిర్వంబు | వారాశిగర్వంబు |
| 43 | ,, | రాత్రించరాధీశులం | రాత్రించరాధీశులన్ |
| 45 | ,, | కృతాంగుడునై | కృతాంగుండునై |
| 47 | ,, | స్వేతాతపత్రంబు | శ్వేతాతపత్రంబు |
| 46 | ,, | వైరోచనుంవేడి | వైరోచనున్ వే |



